# జ్ఞానదేవుడు

రచన:

ప్రొఫెసర్ పి. శ్రీరామమూర్తి





తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

శ్రీనివాసబాలభారతి–84

# జ్ఞానదేవుడు

రచన:
ప్రొఫెసర్ పి. శ్రీరామమూర్తి

ప్రధానసంపాదకుడు:
ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య



ప్రచురణ:
శ్రీ ఎమ్. వి. ఎస్. ప్రసాద్, ఐ. ఏ. ఎస్.
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
1990

T. T. D. Religious Publications Series No. 377

SRĪNIVĀSA BĀLABHĀRATI-64
( Children Series )

# JÑĀNADEVUDU

By

Prof. P. Sriramamurty

*Chief - Editor :*
Prof. S. B. Raghunathacharya

First edition : 1990
Copies : 10,000

Price : 1-00

*Published by :*
Sri M. V. S. Prasad, I.A.S.,
EXECUTIVE OFFICER
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

Art : CHĀYA

Printed at :
Tirumala Tirupati Devasthanams Press, Tirupati.

# ముందుమాట

మాయలు మర్మాలు తెలియక మల్లెపూవులాగ నిర్మలంగా ఉండే మనస్తత్వం బాలల్లో కనబడుతుంది. మంచి కర్పూరాన్ని మించిన ఆ మనస్సులో ఘుమ ఘుమలాడే భక్తిని సంస్కారాలు బాల్యంలోనే ముద్రింపబడాలి. అలా జరిగితే పదికాలాలపాటు భవ్యమైన జీవితాన్ని వాళ్ళు భద్రంగా గడపడానికి పునాది ఏర్పడుతుంది. అలా పెరిగిన ఆ చిన్నారులు రాబోయే తరాలకు మానవజాతి మర్యాదలను, మహనీయతను చాటి చెప్పగలుగుతారు. అందుకే అందాల బాలలకు మన వారసత్వాన్ని, ఇతిహాస-పురాణాల్లో నిక్షిప్తమైన మానవత్వపు విలువల్ని అందించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

ఏ లక్ష్యమూ లేని జీవితం మన అలక్ష్యానికి గురైన అందమైన మొక్కలాగా నిష్ఫలంగా మోడువారిపోతుంది. చిన్నపిల్లలకు లక్ష్యశుద్ధి కలిగించి వారి జీవితాలను తీర్చిదిద్దాల్సిన బాధ్యత ఎప్పుడూ పెద్దలపైనే ఉంటుంది. మానవతకు మాన్యతను చేకూర్చిన కొందరు మహావ్యక్తుల ఆదర్శజీవితాలను చిన్నారిబాలలకు అందించి, వారిద్వారా వారిలో కనువిప్పు కలిగించడానికే ఈ శ్రీనివాసబాలభారతి ఉదయించింది.

ఈ ప్రచురణకు ప్రధానలక్ష్యం చిన్నారి బాలబాలిక లైనా, కుటుంబంలోని పెద్దలుగూడా ఇంతవఱకు ప్రచురింపబడిన పుస్తకాలను ఎంతోబాగా ఆదరించి, మానవత్వపు విలువల్లోని మాధుర్యాన్ని గ్రహిస్తున్నారని తెలుసుకోవడానికి నాకెంతో ఆనందంగా ఉంది. ఇలా తిరుమల తిరుపతి దేవస్థానాల ఆశయం కొంతకు కొంత ఫలవంతమౌతున్నది.

శ్రీనివాసబాలభారతి ప్రచురణను తయారు చేసి, బాలల కోసం రమణీయమైన రచనలను చేయించి, అందఱికీ అందుబాటులో ఉండేటట్లు సంపాదకత్వం నిర్వహిస్తున్న తి. తి. దేవస్థానప్రచురణల సమన్వయాధికారి (కో-ఆర్డినేటర్, పబ్లికేషన్స్, టి.టి.డి.) ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య గారికి నా అభినందనలు. ఈ ప్రచురణలను రూపొందించడంలో సహాయాన్నందిస్తున్న రచయితలకు, కళాకారులకు నా ధన్యవాదాలు.

ఎమ్. వి. ఎస్. ప్రసాద్, ఐ. ఏ. ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# స్వాగతం!!

శ్రీవివాసదయోద్భూతా బాలానాం స్ఫూర్తిదాయినీ।
భారతీ జయతాల్లోకే భారతీయగుణోజ్జ్వలా॥

ఖండ ఖండాంతరాల్లో నాగరికత కన్నువిప్పేనాటికే సభ్యతకు, సంస్కారానికి, నైతిక, ధార్మికాదర్శాలకు పేరు పడ్డది మన భరతఖండం. ఈ గడ్డపై పుట్టిన ప్రతి మానవుడు అధర్మాన్ని ఎదిరిస్తూ, ధర్మాచరణంలో తన జీవితాన్ని పండించుకొని, మాధవాభిముఖంగా నడచి మహనీయకీర్తి నార్జించినవాడే. అలాంటి మహాత్ముల సన్నిధి మన ముఖ సంతోషాలకు పెన్నిధి. కనీసం వారి జీవితాదర్శాలు మన స్సుల్లో మెదిలితే వాటి ప్రభావం మనమీద ఎంతో ఉంటుంది. 'నేను భారతీయుణ్ణి', 'ఇది తరతరాలనుంచి వస్తున్న నా సంప్రదాయం', 'ఇది నా కర్తవ్యం' అని ప్రతి బాలుడు, బాలిక ఈ దేశసేవకు తనను అంకితం చేసుకొంటారు.

నిజానికి ఈ దేశంలో ఎందరో మహామహానుభావులు పుణ్య పురుషులు, మహాపతివ్రతలు, మహావీరులు పుట్టి, పెరిగి,

ఠక్కని సంస్కృతికి పునాదులు వేశారు. స్వచ్ఛమైన జీవన వాహినిని మనదాకా ప్రవహింపచేశారు. ఆహా! మనమెంత అదృష్టవంతులం! మన వెనుక ఎంత ఉదాత్తమైన చరిత్ర ఉంది. ఆ పుణ్యపురుషులు, మహాసాధ్వులు ఇక్కడ పుట్టకపోతే మనదిగా మనం చెప్పుకొనే మహత్తరమైన ఈ సంస్కృతి, సభ్యత మనకెలా సంక్రమించేవి? వాళ్ళను అర్థం చేసుకోవడం, వాళ్ల చరిత్ర మననం చేసుకోవడం, వారి ఆదర్శాలు స్మరించడం కూడ మనకు గొప్ప విజ్ఞానాన్నందించే విద్యా భ్యాసం. అది ముందు ముందు మన జాతి జీవనప్రవాహంలో కొన్ని ఏండ్లదాకా చెక్కుచెదరని స్ఫూర్తినొరభాలను విర జిమ్ముతుంది. అందుకే శ్రీనివాసబాలభారతి ఉదయించింది. ఎందరో మహానుభావుల్ని మీ ముందుంచుతోంది. ఇక మీదే ఆలస్యం.

బాలలూ! రండి! రండి!
నిండు మనస్సుతో మీకిదే మా స్వాగతం!

ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య
ప్రధానసంపాదకుడు

# పరిచయం

అతడొక మహాయోగి. కానీ అహంకారంతో నిండి పోయిందాతని మనస్సు. వన్నీరు బూడిదపాలైంది. క్రూర మృగమైన పులినెక్కి, చేతిలో పాముల్ని, శూలాన్ని ధరించి తన యోగశక్తులను ప్రదర్శిస్తూ వస్తున్నాడు. ఆ సమయానికి అతని ప్రత్యర్థి తన సోదరులతో ఒక గోడ మీద కూర్చున్నాడు. వినయమధురమైన ఆ అబ్బాయి ప్రవృత్తి అందరినీ ఆకట్టుకొనేలా ఉంది. ఇంతలో ఆశ్చర్యం జరిగింది. ఆ బాలుడు కూర్చున్న గోడ నడవటం ప్రారంభించింది. ఆ ధూర్త యోగి ఇదంతా చూసి ఆశ్చర్యపోతున్నాడు. పులిని దిగి బాలుణ్ణి సమీపించి తన అహంకారాన్ని మన్నించమని ప్రాధేయపడ్డాడు. ఆ చిన్నారికి శిష్యుడైనాడు. అలా గోడను నడిపించి అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేసిన ఆ మహనీయుడెవరో తెలుసా? జ్ఞానానికి మరోపేరు అతని పేరు జ్ఞానదేవుడు.

భక్ష్యాలు చేసి దీపావళిరోజున తన అన్నలకు విందు చేయాలని ప్రయత్నించిన ముక్తాబాయికి కొత్త మట్టి పాత్ర దొరకలేదు. వీసోబా అనే అనూయాళువు వీళ్లకు పాత్రలు

అమ్మకూడదని అంగడిలో నిషేధించాడు. బాధపడుతూ ముక్తా బాయి ఇంటికి చేరింది. చెల్లితో 'ఏం పరవాలేదు. నావీపునే పెనంగా పెడతాను. నీవు భక్ష్యాలు తయారు చేసుకో!' అని వంగి తన వీపును గవగనమండే పెనంలాగా సిద్ధపరచిన సిద్ధ పురుషుడాయన.

భగవద్గీతపై ఆమహనీయుడు మరాఠీలో వ్రాసిన 'భావార్థదీపిక' జ్ఞానేశ్వరిగా ప్రసిద్ధి చెందింది. పండరి విఠలుడే నామదేవునితో "నాకు జ్ఞానదేవునికి భేదం లేద" ని చెప్పాడంటే ఆ మహాత్ముడెంతటి జ్ఞానస్వరూపో మనం అర్థం చేసుకోవచ్చు.

ఈనాడు మనలో నిర్మలమైన ఆధ్యాత్మిక జ్ఞానస్ఫూర్తి కలగడానికి జ్ఞానదేవుని జీవిత మొక సందేశం కావాలి.

ఇక చదవండి!

—ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య

# జ్ఞానదేవుడు

భారతదేశం పుణ్యభూమి. అనాదికాలం నుంచి ఇక్కడ ఋషులు, మునులు, సాధువులు, సంతులు అవతరిస్తుండేవారు. వీరి జీవితాలచేత, బోధలచేత ప్రజలు ప్రభావితులై సన్మార్గాన్నవలంబిస్తూ వచ్చారు. అలాంటి మహాత్ములు దేశంలోని అన్నిప్రాంతాలలో ఉద్భవించారు. మధ్యకాలంలో మహారాష్ట్రంలో జ్ఞానదేవుడు, ఉత్తర ప్రదేశంలో కబీరు, పంజాబులో నానక్, వంగదేశంలో చైతన్యుడు, దక్షిణదేశంలో త్యాగరాజు మొదలైన వాళ్లెందరో భక్తులు జన్మించి తమ బోధనలచేత ప్రజలను ప్రభావితులను చేశారు. మహారాష్ట్రంలో జన్మించిన అలాంటి మహాభక్తులలో అగ్రగణ్యుడైన జ్ఞానదేవుడి చరిత్ర తెలిసి కొందాం.

## ప్రజలకు దగ్గఱగా పరమార్థం :

జ్ఞానదేవుడు మహారాష్ట్రంలో 1275వ సంవత్సరంలో జన్మించాడు. జ్ఞానదేవుడు జన్మించేటప్పటికి అక్కడ మహానుభావసంప్రదాయం, నాథసంప్రదాయం ప్రచారంలో ఉండేవి. మహానుభావసంప్రదాయాన్ననుసరించేవారు వైదికధర్మాన్ని, ఆచారాలను అంతగా అవలంబించేవారు కారు. చక్రధరనామంతో విలసిల్లే శ్రీకృష్ణుడే పరదైవతమని విశ్వసిస్తూండేవారు. జ్ఞానదేవుడు వేదాలను ఉపనిషత్తులను భగవద్గీతను ఆధారంగా తీసికొని అందులోని ప్రసన్నగంభీర భావాల పరమార్థాన్ని ప్రజలకు బోధించాడు.

## నాథసంప్రదాయం :

నాథసంప్రదాయంలో వేదాంత యోగాల సమన్వయం ఉండేది. జ్ఞానేశ్వరుని ముత్తాత త్ర్యంబకపండితుడీ సంప్రదాయాన్నే అనుసరించాడు. త్ర్యంబకపండితుడు

నాథసంప్రదాయప్రవక్త యైన గోరక్షానాథుని నుంచి స్వయంగా ఉపదేశాన్ని పొందాడు. తరువాత గహనీ నాథుడు జ్ఞానేశ్వరుని అన్నయైన నివృత్తినాథునకి ఉపదేశం చేశాడు.

## అందరూ అర్హులే:

జ్ఞానదేవుడు దైవభక్తిపరాయణులైన ఒక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. వీళ్లు కులకర్ణులు, అంటే గ్రామకరణాలు. వీరి ముత్తాతయైన త్ర్యంబకపండితుడు పైఠను సమీపంలో ఉన్న అపెగ్రామంలో ఉండేవాడు. ఆకాలంలో దేవగిరిని యాదవరాజులు పరిపాలిస్తూండేవారు. దేవగిరి ఒక సాంస్కృతిక కేంద్రంగా ఉండేది. అందువల్ల అతడక్కడికి తరలివెళ్లాడు; రాజాదరాన్ని పొందాడు. నాథసంప్రదాయానికి చెందిన గోరక్షానాథుని దగ్గర దీక్ష పొందాడు. నాథసంప్రదాయానికి చెందినవారు శివభక్తులు, వీరు యోగసాధనచేసి కుండలినీశక్తిని మేలుకొలుపుకొన

టంలో నిపుణులు. వీరు సరళస్వభావులై కులమతవివక్ష లేక అందరికీ ఈ సాధనను బోధిస్తూండేవారు. ముక్తిని పొందటానికందరూ అర్హులని వీరి విశ్వాసం. ఈ సంప్రదాయం ఉత్తరదేశంలో ఆవిర్భవించింది. మత్స్యేంద్రనాథుడు, గోరక్షానాథుడు దీనిని దక్షిణంలో ప్రచారం చేశారు.

## విఠల్ పంతు విశిష్టత :

త్ర్యంబకపంతు కుమారుడు గోవిందపంతు. అతని భార్య నీరాబాయి. వీళ్లిద్దరూ గహనీనాథుని దగ్గఱ దీక్షను స్వీకరించి నాథసంప్రదాయాన్నవలంబించారు. వీరి ఏకైక పుత్రుడు జ్ఞానదేవుని తండ్రియైన విఠల్‌పంతు, వీరు కూడా ఆపెగ్రామంలోనే నివసిస్తూండేవారు.

విఠల్‌పంతు పుట్టినప్పటినుంచే వైరాగ్య సంపన్నుడు, భగవద్భక్తిపరుడు. జిజ్ఞాసతో శాస్త్రాలన్నింటిని అభ్యసించాడు. సన్మార్గోపదేశాన్నివ్వగల సద్గురువును అన్వేషిస్తూ

తీర్థయాత్రలు చేయసాగాడు. తీర్థాలు సేవిస్తూ పుణ్యపూనా పట్టణానికి సమీపంలోని అలంద్విగ్రామాన్ని చేరాడు. ఇంద్రాయణీనదీస్నానంచేసి తీరంలో ఉన్న చెట్టునీడలో ధ్యానమగ్నుడై కూర్చున్నాడు. ఆ గ్రామకరణం సుప్రసిద్ధ పండితుడైన సిద్ధోపంతు అతనిని చూసి ముచ్చటపడ్డాడు. చిన్నవయసులోనే ఉన్న శాదర్శాలు, పరమార్థచింత అబ్బాయని అబ్బురపడ్డాడు. సిద్ధోపంతు ఆ బాలుడు కళ్లుతెరిచే వరకు వేచి తరువాత కుశలప్రశ్నలడిగాడు. విఠల్‌పంతు తను ఆపెగ్రామవాసుడనని గోవిందపంతు పుత్రుడనని ఏడు సంవత్సరాల నుంచి తీర్థయాత్రలు చేస్తున్నానని విన్నవించాడు. సిద్ధోపంతు అతనిని తన ఇంటికి తీసుకు వెళ్లాడు.

## ఎంతో సంతోషించారు:

సిద్ధోపంతుకి సుందరి, గుణవతియైన రఖుమాబాయి అనే కుమార్తె ఉండేది. పాండురంగని ఆనతిపై సిద్ధోపంతు తన కుమార్తెను పెళ్లి చేసుకోమని విఠలుపంతుని కోరాడు.

విఠలుపంతు కలలో పాండురంగడు అనుమతించటంచేత ఆమెను పెళ్లాడటానికి సమ్మతించాడు. వివాహమహోత్సవం వైభవోపేతంగా జరిగింది. తరువాత సిద్ధోపంతు అల్లుణ్ణి, కూతుర్ని తీసుకుని ఆవెగ్రామానికి వెళ్ళి విఠలుని తల్లిదండ్రులను కలిసాడు. వాళ్ళుకూడా అనురూపమైన కోడలు లభించినందుకు చాలా సంతోషించారు.

## తీరని వెలితి:

భగవద్భక్తి పరాయణురాలు, గుణరూప సంపన్నురాలైన రుక్మిణితో విఠలుపంతు కొన్నిరోజులు చాల ఆనందంగా గడిపాడు. కొంతకాలానికి విఠలుపంతుని తల్లిదండ్రులు గతించారు. విఠలుపంతు చాలా దుఃఖించాడు. పుత్రవాత్సల్యం ఎక్కువగా ఉన్న తల్లిదండ్రులు లేక పోవటం అతనికి తీరని వెలితి కలిగించింది. సిద్ధోపంతు అతనిని ఓదార్చి చోటుమారిస్తే బాగుంటుందని ఆలందికి తీసుకునివచ్చాడు. అయినా విఠలుణ్ణి జీవితంయొక్క అస్థిరత్వాన్ని గూర్చిన ఆలోచనలు వెంటాడుతూనే ఉండేవి.

## ఏనాటికైనా.... ....

ఒకనాడు విఠలుడు రుక్మిణిని సన్యాసం తీసుకోవటానికి అనుమతించమని అడిగాడు. ఆమె "జీవితాన్ని జీవితధర్మాలను విధులను నిర్వర్తించక పారిపోతే శాంతి సౌఖ్యాలు లభిస్తాయా?" అని ప్రశ్నించింది. అతడు నిరుత్తరుడయ్యాడు. కాని మాటిమాటికి ఆయన ఆమెదగ్గర సన్యాసాన్ని గూర్చి ప్రస్తావిస్తూనే ఉన్నాడు. నిద్రాహారాలపై శ్రద్ధవహించటం మానేశాడు. ఒకనాడు భోజనానికి వేళైందని గమనించకుండా ఆలోచిస్తున్నాడు. రుక్మిణి భోజనానికి పిలిస్తే సన్యాసానికి అనుమతి ఇమ్మని అడిగాడు. ఆమె పరాకుగా సరే మొదట భోజనం చేయమని వేడుకొంది. భోజనం చేసి చేయి కడగటానికి వెళ్ళిన విఠలుడు తిరిగి కనిపించలేదు. ఆమె పరాకుమాటలే అనుమతిగా తీసుకొని ఇల్లు వదలివెళ్ళిపోయాడు. అప్పటినుంచి ఆమె దుఃఖిస్తూ అశ్వత్థానికి ప్రదక్షిణలు చేస్తూ ఏనాటికైనా భర్త తిరిగిరాగలడనే ఆశతో పరితపిస్తూండేది.

## విరోవంతు చైతన్యస్వామి అయ్యాడు :

ఇల్లు వదిలిన విరలుపంతు అనేకయోజనాలు ప్రయాణంచేసి కాశీక్షేత్రాన్ని చేరుకొన్నాడు. అక్కడ రామానందుడనే ఒక మహాత్ముని దగ్గరికెళ్ళి సన్యాసాన్ని ప్రసాదించమని ప్రార్థించాడు. తాను ఆలందినుండి వచ్చానని తనకు భార్యాపుత్రులెవరూ లేరని విన్నవించుకొన్నాడు. భార్యాపుత్రులను విడిచి, చెప్పకుండ వచ్చినవారికి సన్యాసాన్నివ్వరాదుకదా! రామానందుడాతడు చెప్పింది సత్యమేనని తలచి సన్యాసదీక్షనిచ్చాడు. అతనికి చైతన్యస్వామియని దీక్షానామం పెట్టాడు.

## నీ భర్త తిరిగి రాగలడు :

తరువాత కొంతకాలానికి రామానందులవారు దక్షిణదేశయాత్రలకు బయలుదేరారు. అన్నిప్రదేశాలను సంచరిస్తూ ఆలందికి వచ్చారు. పరమపుణ్యక్షేత్రమైన కాశీనుంచి వచ్చిన శ్రీరామానందులవారిని సందర్శించ

టానికి సిద్ధోపంతు తనకుమార్తెను తీసుకొని వచ్చాడు. ఆమె రామానందునికి సాష్టాంగ నమస్కారం చేసింది. రామానందుడామెను 'లోకరక్షకులైన సంతానాన్ని కన మని' దీవించాడు. అదివిన్న రుక్మిణి చిరునవ్వుతో 'మహాత్మా! నా భర్త నన్నువిడిచి వెళ్లాడు. నేనెలా సంతానాన్ని పొందుతాను' అని వగచింది. ఆమె విఠలు పంతుని వృత్తాంతాన్ని ఆయనకు విన్నవించుకొంది. అది వినడంతోనే రామానందునికంతా తెలిసింది. వెంటనే రుక్మిణితో 'నామాటలు వ్యర్థాలుకావు. నీ భర్త తిరిగి రాగలడు' అని చెప్పి తిరిగి కాశీకి ప్రయాణమయ్యాడు. కోపారుణనేత్రుడైన గురుదేవుని చూసి చైతన్యస్వామి భయకంపితుడయ్యాడు. "ప్రభూ! నేను ఈ సంసార బంధనాలు త్రెంచుకొనటానికి అలా అసత్యం పలికాను. అందుకు చాలా పశ్చాత్తాపపడుతున్నాను. నాకే శిక్షనైనా విధించండి. సంతోషంతో స్వీకరిస్తా"నని పలికాడు.

**వాళ్లను వెలివేశారు :**

రామానందుడాతనిని మరల గృహస్థాశ్రమాన్ని స్వీకరించమని ఆజ్ఞాపించాడు. విఠలుడు అది శాస్త్రవిరుద్ధమన్నాడు. అందుపై రామానందుడు మొదట అతడు సన్యాసాన్ని స్వీకరించటమే శాస్త్రవిరుద్ధమని తెలియజెప్పి అతనిని గృహస్థుగా తన విధులను నిర్వర్తించమని పంపాడు. విఠలుడు గురువు ఆజ్ఞచేత తిరిగి ఆలందికి వచ్చాడు. సిద్ధోపంతు చాలా సంతోషించాడు.

కాని గురువు ఆజ్ఞాపాలన విఠలుపంతుకొక అగ్నిపరీక్షయైంది. ఊరి బ్రాహ్మణులు వారిని నీచంగా చూడనారంభించారు. విఠలుని, అతని భార్య రుక్మిణిని వెలివేసారు. అతడు భార్యతో గ్రామాన్ని వదలి బయలుదేరి నదీతీరంలో ఏకాంతంగా నివసించసాగాడు. భార్య ప్రేమానురాగాలు, తన వివేకశక్తి అతనికండదండలుగా ఉండేవి.

## జీవితాలే ఉపదేశాలు :

ఆ పుణ్యదంపతులకు వరుసగ నలుగురు సంతానం కలిగారు. మొదట ముగ్గురు కొడుకులు. వాళ్ళకు వరుసగా పరమార్థమార్గంలోని మజిలీలుగ ఎంచి నివృత్తినాథుడు, జ్ఞానదేవుడు, సోపానదేవుడు అని నామకరణం చేశారు. నాల్గవసంతానమైన కూతురికి ముక్తాబాయి అని పేరు పెట్టారు. వీరు నలుగురు సాంఘిక దురాచారాలకు, అర్థం లేని కఠోరనియమాలకు దూరంగా స్వతంత్ర పారమార్థిక వాతావరణంలో జన్మించి పెరిగి పెద్దవారయ్యారు. వీరి జీవితాలల్పాలైనా జీవకోటికంతటికి అనల్పమైన ఉపదేశా న్నందించాయి. విశ్వమానవులకు మేలుబంతులైనాయి.

## గీతోపదేశాలు :

సంతానం కలిగిన ఆనందంతోబాటు సంఘీయుల వలన బాధలు పెరిగాయి. పిన్నవయసులోనే జ్ఞానదేవుడు భగవద్గీతోపదేశాలతో ఆసక్తి కలిగి ఉన్నాడు. అతడు

తండ్రితో అందరికీ సంస్కృతం వస్తే బాగుంటుందని చెప్పాడు. అంతట తండ్రి 'నీవు పెద్దవాడైన తరువాత సరళమైన మరాఠీభాషలో గీతోపదేశాలు తెలిపి అందరిని తరింపచేయమన్నాడు. ఆ మాట అతనిపై గొప్ప ప్రభావాన్ని చూపింది.

**అనుజ్ఞ ఇవ్వండి!**

పిల్లల తెలివితేటలు, పరమార్థానక్తి తల్లిదండ్రులను మురిపించాయి. విఠలుడు వీరింతవారైనా నేను వీరికి ఉపనయనసంస్కారం చేయలేకపోయాను కదా అని బాధపడ్డాడు. ఆ గ్రామంలో పెద్దలైన బ్రాహ్మణులను సమీపించి తమపై ఉన్న వెలిని తొలగించి పిల్లలకు ఉపనయన విధిని నెరవేర్చటానికి అనుజ్ఞనివ్వమని వేడుకొన్నాడు. వారందరు శాస్త్రాలను పరిశీలించి ప్రమాణం కనిపించక అతనికి పైఠను పండితులదగ్గరికి వెళ్ళమని సలహా ఇచ్చారు. విఠలుడు దీనవదనుడై తిరిగి ఇల్లు చేరాడు.

## జ్ఞానదేవుని ఉపదేశించు!

విఠలుడు తన కుటుంబాన్ని తీసుకుని త్ర్యంబకాన్ని చేరాడు. అక్కడ చాలాకాలం ధ్యాననిమగ్నుడై ఉన్నాడు. ఒకనాడు ఉదయాన్నే లేచి సమీపంలో ఉన్న పర్వత ప్రాంతాలకు వెడదామని వారందరూ బయలుదేరారు. అక్కడి ప్రకృతి సౌందర్యానికందరూ ముగ్ధులయ్యారు. అన్నిచోట్ల నిండిఉన్న శాంతికి వారాశ్చర్యపడ్డారు. అంతలోనే ఒకపెద్ద తుఫానువచ్చింది. ఆ అలజడికి కలతచెంది ఒక పెద్దపులి పరుగిడుతూ అక్కడికి వచ్చింది. వారందరు చెల్లాచెదురుగా ఎవరి ప్రాణాలు రక్షించుకోటానికి వారు పరుగెట్టారు. తుఫాను తగ్గిపోయింది. అందరూ ఒకచోట చేరారు. కాని నివృత్తినాథుడు కనిపించలేదు, అతని కోసమందరూ వెదకుతున్నారు. పెద్దపులి వాతపడి మరణించాడేమోనని భయపడుతున్నారు. జ్ఞానదేవుడు వారికి ధైర్యం చెబితే వారు ఇంటికి వెళ్లి నివృత్తినాథుని కోసం ఎదురుచూస్తున్నారు.

కొంతసేపటికి నివృత్తినాథుడు అతి నిశ్చలమనస్కుడై ధీరగంభీరవదనంతో ఇల్లు చేరుకొన్నాడు. పులిభయంతో అతడటు ఇటు పరుగెడుతూ త్రోవ తప్పిపోయాడు. కొంత కాలమలా తిరిగి తిరిగి ఒక గుహను చూశాడు. ఆ గుహలో ప్రవేశించగా అక్కడొక సాధువు సమాధినిష్ఠుడై కూర్చుని ఉన్నాడు. అతడే గహనీనాథుడు. నాథసంప్రదాయానికి చెందిన మహాయోగి, సిద్ధుడు. అతడు నివృత్తినాథుణ్ణి అనుగ్రహించి అతనికి ఉపదేశమిచ్చాడు. జ్ఞానదేవునికి ఉప దేశమివ్వమని నివృత్తినాథుని ఆజ్ఞాపించాడు. నివృత్తి నాథుడు గురువు ఆజ్ఞప్రకారం జ్ఞానదేవునికి ఉపదేశ మిచ్చాడు.

## అతడు కూడా విద్యలు నేర్చుకోవాలా?

తరువాత వారందరు పైఠనునగరాన్ని చేరారు. అక్కడ విద్వాంసులైన పండితుల దగ్గరికి వెళ్ళి విఠలుడు తన పుత్రులకు ఉపనయన సంస్కారాన్నిప్పించండని వేడుకొన్నాడు. "ఉపనయనం లేనిదే వారు వేదాభ్యాసం

చేయలేరు. వారు మహత్తరమైన వేదవిజ్ఞానవంతులవు తారు. వారందరు బుద్ధిమంతులు, జిజ్ఞానువులు, భగ వద్భక్తి పరాయణులు; వీరిలో జ్ఞానదేవుడు చాలా తెలివి గలవాడ"ని చెప్పుకొన్నాడు. ఆ బ్రాహ్మణులందరు అతని మాటలు విని "నీ పుత్రుడే జ్ఞానదేవుడు కదా! అతనికిక విద్యలు నేర్పవలసిన పని ఏమి?" అని ఆక్షేపించారు.

## భేదమేమీ లేదు:

అదే సమయంలో ఒక రైతు ఒక దున్నపోతును కొడుతూ జ్ఞానా! త్వరగా నడవమని బెదరిస్తున్నాడు. అది విన్న ఆ బ్రాహ్మణులు-'' ఆ దున్నపోతు పేరుకూడ 'జ్ఞాన' అనే కదా! మీ జ్ఞానదేవునికి దానికి భేదమేమి" అంటూ పరిహాసాలాడారు. అందుకు జ్ఞానదేవుడు మృదు గంభీరవచనాలతో ఇలా అన్నాడు-"అవును భేదమేమీ లేదు. చూడండి! దానిపై కొట్టిన దెబ్బలు నాకూ తగి లాయి కదా!" అని తన వీపుపై కొరడాదెబ్బల చారలను

చూపించాడు. అది చూసిన పండితులందరు ఆ అద్భుతానికి చకితులై జ్ఞానదేవుడు అసామాన్యశక్తిమంతుడని తెలిసి కొన్నారు. జ్ఞానదేవుడు వారందరికి భగవంతుడందరిని సమానంగానే సృష్టించాడనే గుణపాఠాన్ని చెప్పాడు.

## దున్నపోతు వేదం చదివింది :

అప్పటికీ విశ్వాసం కలుగక ఒక బ్రాహ్మణుడు "ఆ పశువుకు మనకూ భేదం లేకపోతే ఆ పశువు వేదాలను చర్చించగలదా?" అని ప్రశ్నించాడు. అంతట జ్ఞానదేవుడా మహిషాన్ని సమీపించి ప్రార్థనచేసి వేదమంత్రాలు పఠించమని కోరాడు. వెంటనే ఆ మహిషం స్వరయుక్తంగా వేదపారాయణం చేయనారంభించింది. అందరూ ఆశ్చర్యమగ్నులయ్యారు. జ్ఞానదేవుని సమీపించి "మీరు మహాపురుషులు, మా అజ్ఞానం పటాపంచలైంది. మీకు ఉపనయనసంస్కారం చేయటానికి మాకెలాంటి అర్హం తరం లేద"ని చెప్పారు. అందుకు ఆసోదరులు "మాకు

ఉపనయన సంస్కారాలక్కరలేదు. మేము బాలురుగానే సన్యసించదలచాం. మీరు మాకు అనుమతి పత్రాన్నిస్తే చాలని అన్నారు. అలాగే అనుమతిపత్రం ఇవ్వబడింది.

## బదరికి వెళ్లిపో!

అదే సమయానికి రామానందస్వామి పైఠనునగరానికి వచ్చాడు. అతడు విఠలుని, అతని సంతానాన్ని చూసి చాల సంతోషించాడు. "నీవు మళ్లీ గృహస్థాశ్రమం స్వీకరించనని అంటూనే వచ్చావు. నీవీ సంతానాన్ని పొంది కృతకృత్యుడవయ్యావు. ఇపుడు నీ భార్యతో బదరీనాథ క్షేత్రానికి వెళ్లిపో! అక్కడ తపోవ్రతాన్ని ఆచరిస్తూ కృతార్థుడవు కమ్మ"ని ఆజ్ఞాపించాడు. విఠలుడు చిన్నదైన ముక్తాబాయిని జాగ్రత్తగా చూసుకొమ్మని సోదరులను హెచ్చరించి బదరీక్షేత్రానికి ప్రయాణమయ్యాడు.

## నన్ను క్షమించండి !

రామానందస్వామి జ్ఞానదేవుని భాగవతధర్మ ప్రచారం చేయవలసిందిగా కోరాడు. జ్ఞానదేవుడు తాను సర్వేశ్వరుని సేవకుడనని అతని ఆజ్ఞను శిరసావహించటమే తన ధర్మమని తలచి తన జీవితాన్ని భాగవత ధర్మప్రచారానికి అంకితం చేశాడు. వాళ్ళు నలుగురూ పండరిపురానికి ప్రయాణమయ్యారు. వేదపాఠం చేసిన ఆ మహిషం కూడ వాళ్ళననుసరించింది. త్రోవలో వాళ్ళు సేవసే గ్రామాన్ని చేరుకున్నారు. అక్కడొక మసీదు ఉంది. ఆ మసీదులో ఆరాత్రి గడపదలచారు. అక్కడి అధికారియైన ఒక మునల్మాను ముల్లా వారిని నివారించాడు. "ఈ మసీదు మహనల్మానులది" అని చెప్పాడు. అంతట జ్ఞానదేవుడు బిగ్గరగా ఆ మసీదునుద్దేశించి "నీవు ఎవరికి చెందినదానవ"ని ప్రశ్నించాడు. ప్రత్యుత్తరంగా "నా మసీదు జనులందరిదీ" అని వినబడింది. ఆ మాటలు విన్న ముల్లా సంభ్రమాశ్చర్యాలతో "మీారెవరో మహనీయులు. నన్ను

క్షమించండి, మీరీ రాత్రి ఇక్కడనే విశ్రమించి వెళ్లండ''ని ప్రార్థించాడు. వారలానే సేదదీర్చుకొని ఉదయమే బయలు దేరి తమ పయనం సాగించారు.

## వచ్చిదావండా! లే!

వారు బయలుదేరిన వెంటనే ఒక శవాన్ని మోసి కొంటూ ఒక ఊరేగింపు ఎదురయింది. ఒక స్త్రీ దీనవద నగా ఊరేగింపులోనుంచి వచ్చి జ్ఞానదేవుని పాదాలపైన బడింది. అతడామెను "పుత్రవతివై సౌభాగ్యం పొంద మ"ని దీవించాడు. ఆమె విలపిస్తూ-"మహాత్మా! ఆశవం నా భర్తదే. ఆయన మరణించాడు. నేను నతినై సహగ మనం చేయడానికి పోతున్నాను'' అని చెప్పింది. అది విని జ్ఞానదేవుడు "మనమందరం దేవునికి పనిముట్టుల వంటివారం. ఆ పరమేశ్వరుడు నా చేత ఈ దీవనలు పలి కించాడు. కనుక అతడే నీ భర్తకు ప్రాణదానాన్ని కూడ చేయుగలడ''ని పలికాడు. అక్కడ కూడిన ప్రజలందరు

ఇది ఎలా సాధ్యమవుతుందా అని చూస్తున్నారు. జ్ఞాన దేవుడా శవాన్ని దించండని చెప్పాడు. అతడు దాని దగ్గరికెళ్ళి 'ఓ సచ్చిదానందరూపుడవైన పరమాత్మా! నీ అంశ అయిన ఆత్మను ఈ మృతదేహంలో చొరనివ్వు' అని ప్రార్థించాడు. సచ్చిదానందా! లెమ్మని అనగానే అతడు నిద్రనుంచి లేచినట్లు లేచి నిలబడ్డాడు. అందరూ ఆశ్చర్యచకితులయ్యారు. వారందరూ జ్ఞానదేవునికి నమస్కరించి 'మహాత్మా! మీరు మహానుభావులు. మరణించినవాణ్ణే పునరుజ్జీవితునిచేశారు' అని కొనియాడారు. అంతట జ్ఞానదేవుడు వారికి భగవద్గీతలోని ఉపదేశాలు స్పష్టంగా తెలియచెప్పాడు.

**భావార్థ దీపిక ;**

'ఆత్మకు చావులేదు. మరణమనేది కేవలం జీర్ణించిన దేహాలను వదలటమే. ఆత్మ మళ్ళీ మరొక శరీరాన్ని ధరిస్తుంది అని చెప్పాడు. దానితో వారు గీతోపదేశాలను

సంపూర్ణంగా తెలియబరచమని ప్రార్థించారు. జ్ఞానదేవుడు అన్న నివృత్తినాథునివంక చూశాడు. అతని అనుమతితో అతడు గీతారహస్యాన్ని సరళమైన దేశభాషలో వివరించటం ఆరంభించాడు. భగవద్గీతలోని 770 శ్లోకాలకు తొమ్మిదివేల 'ఓవీ' లలో వ్యాఖ్యానం చేశాడు. ఓవీ ఛందం మరాఠీభాషలో సుప్రసిద్ధమైంది. ఇది గానయోగ్యమైంది. ఇందులోని భాష మృదుమధురం, సర్వసులభం. దీనిని 'భావార్థదీపిక' అని అంటారు. భావాలు ప్రసన్న గంభీరాలై హృదయాల నాకర్షిస్తున్నాయి. భగవద్గీతపై దేశభాషలలో వ్రాసిన వ్యాఖ్యానాలలో ఇది మొదటిది. ఇది 'జ్ఞానేశ్వరి' అని ప్రసిద్ధిగాంచింది. నివృత్తినాథుడు దీనిని ప్రశంసిస్తూ ఉపనిషత్సారాన్ని పొందుపరుస్తూ మరొక స్వతంత్రగ్రంథాన్ని వ్రాయమని తమ్ముణ్ణి ప్రేరేపించాడు. దానితో అతడు స్ఫూర్తివాదాన్ని ప్రతిపాదిస్తూ 'అమృతానుభవ' మనే గొప్ప గ్రంథాన్ని రచించాడు. ఇందులో శాంకరాద్వైతం సమర్థింపబడింది.

ఈ విధంగా గీతావ్యాఖ్యానాన్ని పూర్తి చేసి అక్కడి నుంచి ఆలందికి వారు ప్రయాణమయ్యారు. త్రోవలో ఆ మహిషం మరణించింది. దానిని సమాధిచేశారు. వారు ఆలందిచేరగనే అక్కడి ప్రజలు వారికి ఘనస్వాగతం ఇచ్చారు. ఆ సోదరుల ముఖపద్మాలు భగవద్భక్తితో విక సించి ఉన్నాయి. జనులందరు తమను తరింపజేయడానికి వచ్చిన మహాత్ములుగా వారిని గుర్తించారు. నేను నేనంటూ వారు జ్ఞానదేవునికి శిష్యులయ్యారు.

## వీపే పెనమైంది!

జ్ఞానదేవుని మహిమలను ప్రకటించే గాథలెన్నో ఉన్నాయి. వీసోబాయనే బ్రాహ్మణుడు ఈర్ష్యాళువు. ఇతడు వెలి వేయబడిన బ్రాహ్మణబాలురకీ గౌరవమర్యాదలు తగవని భావించాడు. ఆ రోజు దీపావళిపండుగ. నివృత్తి నాథుడు చెల్లెలిని భక్ష్యాలు తయారుచేయమని కోరాడు. ఆమె సరేనని కొత్త మట్టిపాత్రను తీసుకుని రావటానికి

కుమ్మరివాని దగ్గరికెళ్ళింది. కుటిలుడైన వీసోబా పాత్రలను వీరికి అమ్మకూడదని నిషేధించాడు. ఈ వెలివేయబడిన వారికి మీరు కుండలనమ్మితే మీ కుండలనన్నింటిని బద్దలు చేస్తానని బెదరించాడు. ముక్తాబాయి అశ్రుపూరిత నయనాలతో ఇంటికి పోయింది. జ్ఞానదేవుడామెను ఓదారుస్తూ 'నావీపుపైన నీవు భక్ష్యాలు చేయమ'ని చెప్పాడు. జఠరాగ్నిని ప్రజ్వలింపచేస్తూ అతడు వీపునే పెనంగా చేశాడు. ముక్తాబాయి భక్ష్యాలుచేసి సోదరులందరికి విందు చేసింది. ఇది అంతా రహస్యంగా పరికిస్తున్న వీసోబా విస్తుపోయి లజ్జాభరితుడై పశ్చాత్తాపం చెందాడు. ఆ సోదరుల పాదాలపైబడి క్షమాభిక్ష వేడుకొన్నాడు.

## గోడే పడిచి వెళ్ళింది :

జ్ఞానదేవుని మూడవకృతి 'చాంగదేవపాషష్టి.' దీని రచనకు సంబంధించి ఒక ఐతిహ్యం ఉంది. చాంగదేవుడు మహాయోగి. కష్టతరాలైన యోగసాధనలను చేసి జరామృత్యువులను జయించాడు. అయినా అతడహంకారి. పిన్న

వాడైనా మహామహిమగల జ్ఞానదేవుని చూడాలను కొన్నాడు. అతనికొక లేఖను పంపాలనుకొన్నాడు. కాని వయసులో చిన్నయైన అతనినెలా సంబోధించటమా అని తెల్లకాగితాన్నే పంపాడు. తానొక భయంకరమైన పులిని ఎక్కి, పాములను, శూలాన్ని చేతపట్టుకుని జ్ఞానదేవుని దగ్గరకు బయలుదేరాడు. ఆసమయంలో జ్ఞానదేవుడు కూడా తన సోదరిసోదరులతో ఒక గోడపై కూర్చొన్నాడు. ఆ తెల్లకాగితాన్ని లేఖగా పంపినదానిని చూసి నవ్వుకొని ఆ గోడనే కదల్చి అది వాహనంగా చాంగదేవునికి ఎదురు వెళ్లాడు. అచేతనమైన గోడనే కదలించి తెగలిగిన జ్ఞాన దేవుని మహిమను చూసి చాంగదేవుడు సిగ్గుపడ్డాడు. పులిని దిగి భక్తి వినమ్రుడై జ్ఞానదేవునికి పాదాభివందనం చేశాడు. తానెన్ని సంవత్సరాలు యోగసాధనచేసినా తన చిత్తమా కాగితంలాగా ఏమీ అంటకే ఉండిపోయిందని బాధ పడ్డాడు. జ్ఞానదేవుడాతనికుపదేశం చేస్తూ 65 ఓవీలను పూర్తి చేశాడు. అవే 'చాంగదేవపాషష్టి' అని ప్రసిద్ధికెక్కాయి.

జ్ఞానదేవుడు హిందిపదాలను కొన్నింటిని వ్రాసి ఉన్నాడు. చాంగదేవుడు జ్ఞానదేవుని భక్తునిగ మారినవార్త నలుదిక్కుల వ్యాపించింది. అలాంటి మహాయోగినే పరాజితుని చేసిన మహనీయుని సందర్శించి జన్మపావనం చేసుకొందామని వేలకొద్ది భక్తులు అలందికి చేరారు.

## వాళ్ల ననుగ్రహించండి!

జ్ఞానదేవుడు సోదరసోదరీ సహితంగా తీర్థయాత్రలు చేయాలనుకొన్నాడు. పుణ్యక్షేత్రాలను సందర్శిస్తూ 'చాకణ' అనే గ్రామాన్ని చేరాడు. ఆ ఊరిలో మహీపతి రాయలనే ఒక శ్రీమంతుడుండేవాడు. అతనికి జ్ఞానదేవు డంటే అపారభక్తి గౌరవాలుండేవి. అతనిని తన ఇంటికి తీసుకొనిపోయి ఎంతగానో సత్కరించాడు. మహీపతి రాయని కుమార్తె సీతాబాయి. ఆమెభర్త రామరాయలు. ఆయన గొప్ప జమీందారు. సీతాబాయికి తండ్రికి లాగానే జానదేవునిపై అపారభక్తి ప్రపత్తులుండేవి. కాని ఆమె భర్త

అయిన రామరాయలకు సాధుసంతులపైన అంత ఆదరం ఉండేదికాదు. ఆయన స్వగ్రామం కర్హాడద. మహీపతి రాయలు జ్ఞానేశ్వరుని ఆ గ్రామానికి వెళ్ళినపుడు తన కూతు రింటికి వెళ్ళి వాళ్ల నను గ్రహించండని వేడుకొన్నాడు.

## జ్ఞానదేవుణ్ణి వేవే!

జ్ఞానదేవుడు పండరీపురానికి వెడుతున్నాడు. ఆకాలంలో పండరిపురంలో సుప్రసిద్ధుడైన నామదేవుడనే భక్తుడు నివసిస్తున్నాడు. వారిద్దరూ కలిసికొని బ్రహ్మానంద భరితు లయ్యారు. తన యాత్రలలో నామదేవుని తీసుకొని పోవాలని జ్ఞానదేవునికోరిక. కాని నామదేవుడు పండరి నాథుని దర్శనంలేకుండా ఒక్కరోజైనా గడపలేడు. జ్ఞాన దేవుని కోరికను కూడ త్రోసిపుచ్చలేక పోయాడు. దానితో అతడు పండరినాథుని అనుమతి అయితేనే రాగల నని చెప్పాడు. అదివిన్న జ్ఞానదేవుడు పండరివిఠలుని ప్రార్థిస్తే అతడు ప్రత్యక్షమై నామదేవుని జ్ఞానదేవునితో తీర్థ

యాత్రలకెళ్ళమని ఆజ్ఞాపించాడు. తానే జ్ఞానదేవస్వరూపుడని అతనిలోనే తనను చూసుకోమని చెప్పాడు. దానితో వారిద్దరూ సోదరీ సోదరులతో తీర్థయాత్రలకు బయలుదేరారు. వాళ్ళు భగవద్భజన కీర్తనలు జరుపుతూ, జ్ఞానోపదేశం చేస్తూ మెట్టిన భూమినంతా పవిత్రీకరిస్తూ పోతున్నారు.

ఆ సంతు మహాత్ములు తేదగ్రామానికి వచ్చారు. అక్కడ 'భక్తకుంభారు' అని ప్రసిద్ధిచెందిన భక్తాగ్రేసరుడున్నాడు అయన వీరికందరికీ అదరసత్కారాలు చేశాడు. ముగ్గురు మహాజ్ఞానులు ఒక్కచోట చేరిన పవిత్ర సమయమది.

ఆ భక్తబృందం సంచరిస్తూ కర్హాడదగ్రామాన్ని సమీపించారు. ఆ గ్రామంలోని జమీందారు రామరాయలు ఈ సంతులమహిమ తెలియక వారిని తన గ్రామంలోకి రాకూడదని కట్టుబాటు చేశాడు. ఈ వార్త

సీతాబాయికి తెలిసింది. ఆమె చాలా చింతించింది. చివరికి సీతాబాయి ఉపాయంతో అతణ్ణి సమ్మతింపచేసింది. జ్ఞానదేవుడు తన ఉపదేశప్రభావంచేత రామరాయని మనస్సు నాకట్టుకున్నాడు.

## హద్దులు మీరిన ఆనందం :

ఉజ్జయినిలో వీరమంగళుడని ఒక భక్తుడు ఉండేవాడు. అతనికి రామానందుడు జ్ఞానదేవునిరాకను గూర్చి ఎప్పుడో చెప్పాడు. అతడు ఎదురు చూస్తున్నాడు. అతని భక్తి శబరిభక్తి వంటిది. జ్ఞానదేవుడు ఉజ్జయిని చేరగానే అతనికి దర్శనమిచ్చాడు. అతని ఆనందానికి మేరలేదు. ఆనందాతిరేకంతో ధన్యవాదాల నర్పిస్తూ అతడు దేహత్యాగం చేశాడు. ఆ ప్రదేశంలో జ్ఞానదేవుడు శివలింగాన్ని ప్రతిష్ఠించాడు. ఆశివలింగమిప్పటికీ ఉజ్జయిని సమీపంలో గల సాందీపాశ్రమానికి తూర్పుదిక్కున విరాజిల్లుతోంది.

## ఏనుగుకేం తెలుస్తుంది?

క్రమంగా ఈ భక్తవర్యులు కాశీనగరాన్ని చేరారు. ఆనగరంలో వారికొక పెద్దఊరేగింపు ఎదురయింది. అంబారీతో అలంకరింపబడిన ఒక ఏనుగు పూలమాలను తొండంతో తీసికొని వీరివైపుకే రాసాగింది. ఆ ఏనుగు జ్ఞానదేవుని సమీపించి అతని మెడలో ఆ పూలదండను వేసింది. ఆ ఏనుగువెంట ముద్గలాచార్యుడనే మహాపండితుడు యజ్ఞదీక్షితుడై వస్తున్నాడు. తాను చేసే యాగంలో అగ్రాసనాన్ని అలంకరించటానికి తగిన వ్యక్తిని ఎన్నిక చేయటానికి ఆతడీపద్ధతిని అవలంబించాడు. కాని అక్కడి బ్రాహ్మణులు అబాలుని ఔన్నత్యాన్ని గుర్తించలేక "ఎవరు యోగ్యులో ఏనుగుకేమి తెలుస్తుంద"ని ఆక్షేపించారు. అది విన్న నామదేవులు మరి ఏవిధంగా మహాపురుషులని తెలిసికొంటారని ప్రశ్నించారు. దానితో అక్కడి పండితులు కాశీవిశ్వేశ్వరుదెవని చేతులతో పురోడాశాన్ని (ప్రసాదమును) స్వీకరిస్తాడో వాడే మహాత్ముడని మేము

విశ్వసిస్తామని ఉద్ఘోషించారు. అంతట వారందరూ విశ్వే శ్వరుని ఆలయానికి వెళ్లారు. అక్కడ జ్ఞానదేవుడు విశ్వే శ్వరుని స్తుతించి పురోడాశాన్ని నివేదించాడు. విశ్వేశ్వ రుడది స్వీకరించగా అది అదృశ్యమయ్యింది. అందుపై వారందరూ జ్ఞానదేవుడు సామాన్యమానవుడు కాడని, మహామహిమాన్వితుడనీ గుర్తించి వారికి యజ్ఞంలో అగ్రా సనాన్నలంకరింప జేశారు. పెద్ద ఊరేగింపు చేసి అతణ్ణి గౌరవించారు.

## వార్కరీసంప్రదాయం:

ఇలా తీర్థయాత్రలు జయప్రదంగాచేసి వారు అలందికి తిరిగివచ్చారు. వెళ్ళిన ప్రదేశాలలో నామసంకీర్తన లను చేస్తూ తన ఉపదేశాలు వినిపిస్తూ వచ్చారు. ఇలాంటి సంప్రదాయాన్నే వార్కరీ (యాత్రిక) సంప్రదాయ మంటారు. జ్ఞానదేవుడే ఈ సంప్రదాయానికి మూలపురు షుడుగా కొనియాడబడుతున్నాడు. తరువాత ఈ సంతు

మహాత్ముల సంప్రదాయమే తుకారాం మొదలైన భక్తా గ్రేసరుల చేత నలుదిక్కుల వ్యాపింపచేయబడింది. నామ దేవుని హిందీకీర్తనలు 80 సిక్కుమత గ్రంథమైన గ్రంథ సాహెబ్‌లో చేర్చబడినాయి.

## భౌతికదేహం పరిత్యజించాడు :

జ్ఞానదేవుడు కారణజన్ముడు. తాను చేయాల్సిన కార్యాలనన్నిటిని ఇరవై ఒక్క సంవత్సరాల ప్రాయంనాటికే పూర్తి చేశాడు. కార్తీక బహుళ త్రయోదశీ గురువారం నాడు మధ్యాహ్న సమయంలో భౌతికదేహాన్ని పరిత్య జింప నిశ్చయించాడు. నామదేవుడీ సంఘటనను ఎంత గానో గంభీరంగా వర్ణించారు:

"జ్ఞానదేవులు జీవన్ముక్తులు. సమాధియోగ్యమైన ఆసనాన్ని స్వీకరించి కూర్చున్నారు. జ్ఞానేశ్వరిని ముందుం చుకొని మూడుసార్లు చేయి జోడించి నమస్కరించారు.

కళ్ళు మూసుకున్నారు. " తరువాత ఒకటి రెండు సంవత్స రాల కాలంలోనే నివృత్తినాథుడు, సోపానదేవుడు, ముక్తా బాయి కూడ పరమపదించారు.

ఈ విధంగా చిన్నవయస్సులోనే యింత మహా మహిమాన్విత జీవితాన్ని గడపి, భగవద్భక్తులకు మార్గదర్శ కులై, అసామాన్య ప్రతిభాస్ఫోరకమైన ఉద్గ్రంథాలను రచించి, భక్తజన హృదయాంకితులైన శ్రీజ్ఞానదేవులు ధన్యులు. ఈ చిన్ని జీవితచరిత్రను వారు జ్ఞానేశ్వరిని ముగించిన మాటలతో ముగించటం యుక్తం కదా !

## జ్ఞానదేవ సుభాషితాలు :

ఈ సమస్త జగత్తుకు అంతరాత్మయై ప్రేరకుడైన పరమేశ్వరుడు నాయీ వాగ్రూపమైన యజ్ఞంచేత ప్రీతుడై నాకి ఆశీస్సులనిచ్చుగాక !

దుర్మార్గులు తమ దౌష్ట్యాన్ని వదలి సన్మార్గాన్నవ లంబింతురు గాక! జీవులలో పరస్పరం ప్రేమప్రీతులు నెల కొను గాక!

దుష్కర్ముల మానసాలలో అజ్ఞానాంధకారం పటా పంచలై జ్ఞానప్రకాశమావిర్భవించు గాక!

సృష్టిలోని జీవులందరూ స్వధర్మాన్నెరిగి ఆచరింతురు గాక! అందరి కోరికలు నెరవేరు గాక!

ఈ భూమిలోని మానవులందరు హితోపదేశం చేసే మహాపురుషుల సత్సంగంలో పాల్గొందురు గాక!

దైవభక్తిపరాయణులైన మహాత్ములు కల్పవృక్షం వంటివారు. వారి నీడలో అన్ని కోరికలు నెరవేరుతాయి. వారు చింతామణివంటివారు. అందరి చింతలను తీరుస్తారు. వారి మాటలు అమృతసముద్రాలు. వారు మానవ హృదయాలలోని చైతన్యాన్ని మేల్కొల్పుతారు.

అలాంటి భగవద్భక్తులే మనకు నిజమైన మిత్రులు, బంధువులు అవుతారు. వారి సాంగత్యమే అందరి హృదయాలలో సద్బుద్ధిని కలుగజేస్తుంది. వారు మచ్చలేని చంద్రునివంటివారు. వారుశీతలప్రకాశంగల సూర్యుని వంటివారు.

ఈ ప్రపంచమంతా పరిపూర్ణమైన ఆనందసామ్రాజ్యమై ఆదిపురుషుని భక్తితో పరవశమైపోవాలి.



T.T.D. Religious Publications Series No.: 377

Price : Rs. 3-00

## బాలభారతి ప్రచురణలు

1. హనుమంతుడు... రూ. 3-00
2. జనకుడు ... రూ. 1-00
3. శ్యామశాస్త్రి ... రూ. 2-00
4. భక్తనందనార్ ... రూ. 1-00
5. పురందరదాసు ... రూ. 1-00
6. యశోద ... రూ. 4-00
7. తులసీదాసు ... రూ. 1-00

Printed and Published by The Executive Officer, T.T.Devasthanams and Printed at T.T.D. Press, Tirupati.